# ఇష్టాగోష్ఠి

—— ఆంగీరసుడు

ఆంధ్ర కృష్ణాపత్రికల ధోరణి.

౨-మేనెలరంతేది "గోలకొండ పత్రిక"లో శ్రీ శాస్త్రుల చిలుకూరి నారాయణరావు పంతులుగారు "శుభాకాంక్ష" శీర్షికలో నిచ్చిన ఆశీస్సులో ఆంధ్ర కృష్ణాపత్రికల ధోరణినివివరించి రి. పంతులుగారి నిష్పాక్షికవిమర్శను నేను సమర్థించుచున్నాను. నేనేకాదు స్వతంత్ర భావములున్న ప్రతిఆంధ్రుడు బలపరచును. అట్లని ఆంధ్ర కృష్ణాపత్రికలుచేసిన అపారసేవ నెవరును మరువజాలరు. "ఆంధ్రకృష్ణాపత్రికలకు నందానాను తెక్కువగానుండవచ్చును......కాని ఆంధ్రపత్రికకు ప్రత్యేకతలేదు. ప్రత్యేకదృష్టిలేదు. ప్రత్యేక లక్ష్యములేదు. దానిలోని సంపాదకీయములు ప్రజాభిప్రాయము నేకముఖమునకు తేనటమునకు ఇంతవరకును ఉపయోగపడలేదు. కేవలము ప్రజలకు వార్తలందించడమే దాని ప్రయోజనము.

కృష్ణాపత్రిక సంపాదకీయములను పేరుపడ్డ. కాని దానిలో వార్తలు తక్కువ ........" నారాయణరావుగారిలేఖిని స్వతంత్రమైనది. రావుగారుచెప్పిన మాటలన్నియు నిజము. పాతికసంవత్సరములపైనుండి ఆంధ్రప్రబోధముచేయుచున్న ఆంధ్రపత్రిక; తెలంగాణములో ఎన్ని తెలుగుజిల్లాలున్నవో అందలిపరిస్థితులెట్లు పరిణమించుచున్నవో హైదరాబాదు రాష్ట్రాంధ్రుల కష్టనిష్ఠురములెట్లున్నవో ఎన్నడూ తెలియజాలదు. ఏదో అన్ని మద్రాసుపత్రికలకు వచ్చిన వార్తలవంటివే వారివిలేఖరులు వ్రాసినవి ఆంధ్ర పత్రికలో యుండినయుండుగాక. పూనాలో "కేసరి" "మహారాట్టా"పత్రికలు హైద్రాబాదు మహారాష్ట్రులను గురించి శ్రద్ధవహించుచున్న దానిలో పందోవంతైననూ ఆంధ్రపత్రికలో కానరాదు. దెబ్బదిలక్షలాంధ్రులనుగురించి వివరములు తెలియజెప్పని పత్రిక "ఆంధ్రపత్రిక"యనిపిలుచుకొనుటహాస్యాస్పదము. "గుడుగుడుగుండం" అన్నట్లు కోస్తాజిల్లాలు తప్పింటే ఆంధ్రులనుగురించియే ఏమిరాసినను గతసంవత్సరాంతమున కడపలో జరిగిన రాయలసీమమహాసభ (శ్రీ టి.ఎస్.రామకృష్ణారెడ్డిగారి (మదనపల్లి) అధ్యక్షతనుగురించి ఆంధ్రపత్రికకువ్రాయుటకు కడపలో ఆంధ్రపత్రికా విలేఖరిలేడు. అపుడొకఆంధ్రప్రముఖుడు సదరుమహాసభనుగురించివ్రాసెను. ఆరోజులలో అనంతపురములోనూ ఆంధ్రపత్రికావిలేఖరి లేడు. కడప అనంతపురములలోనే గతి. ప్రాంతములో ఆంధ్రపత్రికకు స్వంతవిలేఖరులు లేకపోతే నల్లగొండ మెదకు వరంగల్లులలో విలేఖరులులేరనుటలో ఆశ్చర్యమేమున్నది? ఖమ్మమెట్టు ఆంధ్రమహాసభకు ఆంధ్రపత్రికాప్రతినిధిలేదని అచట ఆంధ్రనాయకులు నొచ్చుకొనిరి. బెజవాడనుండి వచ్చిన ఒకఆంధ్రప్రముఖుడు ఆసభావివరములను ఆంధ్రపత్రికకువ్రాసెను. డెబ్బదిలక్షలాంధ్రులను ఆంధ్రపత్రిక మరచిపోయినదని చెప్పితీరవలెను.

ఇంక ఆంధ్రపత్రికా సంపాదకీయములు స్వతంత్రవ్యక్తిత్వములో కూడియుండవు- అసోసియేటెడ్ రాయిటర్ వార్తలను సంపుటీకరణము చేసి సంపాదకీయములోని కెక్కించుటయే సదాచూచుచుందుము. పోనీ స్వతంత్ర భావము లను ప్రకటించు యువకులకైననూ ఆంధ్రపత్రికలో చోటునివ్వరు. జిన్నాసాహేబు కాంగ్రెసునెట్లుదూషించినను పెద్దఅక్షరములతో ప్రచురించు ఆంధ్రపత్రిక చిరకాలమునుండి కాంగ్రెసు సేవచేసిన వానికలమునుండి గాంధిమహాత్మునితో వ్యతిరేకాభిప్రాయపడి వ్రాసినపోటు నివ్వదు- అందు చేత నే ఆంధ్రపత్రికకు ప్రత్యేకతలేదు-ప్రత్యేకదృష్టి లక్ష్యములేదని రావుగారు ప్రవచించిరి-ఆంధ్రపత్రికావిధానములో పూర్తియైనమార్పులు కలుగుటయు, స్వతంత్రభావములను ప్రకటించుటయు, స్వతంత్ర ఆదేశము (Lead) నిచ్చుటయు, డెబ్బది లక్షల తెలంగాణాంధ్రుల కష్టనిష్ఠురములను ప్రకటించుటయు జరిగినగాని ఆంధ్రజాతికిని ఆంధ్రమునకును సర్వతోముఖాభివృద్ధియుండదు. ఆంధ్రులకు విజ్ఞానసర్వస్వమనబడు ఆంధ్రపత్రిక పూర్ణవికాసముతో విరాజిల్లుటకు ఆపత్రికా విధానములో చాలమార్పులు యవసరము.

ఇంక కృష్ణాపత్రిక అంతరిక్షమార్గములో యున్నట్లుండును. "తనతిండితానుతింటూ యవటివానికి భయపడవల"ననుసామెతయున్నది. కృష్ణాపత్రికాసంపాదకీయములు తెలుగు పత్రికారచనలో ప్రత్యేకవ్యక్తిత్వమునుగణించినవి. కానితన ధోరణితనది. తనపత్రికనుపఠించు ఆంధ్రులు తమ భావములనెట్లుస్వీకరించుచున్నదియు కృష్ణాపత్రికకుఅక్కరలేదు. ఇష్టమువచ్చినరీతిని వ్రాయుటయేతత్పత్రికా విధానమువలెకానవచ్చుచున్నది. ఒక ఉదాహరణమునుచూతము. రెండుసంవత్సరములక్రితము ఆంధ్రరాష్ట్రోద్యమము చాల తీవ్రముగసాగెను. అప్పుడుఆంధ్రదేశములోని అన్ని తెలుగుపత్రికలు సమర్థించెను. ఒక్కకృష్ణాపత్రికయే ఆంధ్రోద్యమమును అనేకవిధముల హేళనాపూర్వకముగనిందించెను. రాజగోపాలాచారిగారు ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకు ప్రబలశత్రువని ఆయనస్వవచనవ్యాఘాతప్రకటనలే సాక్ష్యము. అట్టిరాజాజీని సమర్థించుచూ కృష్ణాపత్రిక ఎన్నిరీతులుగానైన ఆంధ్రోద్యమమును దానినినడిపించుచున్నవారిని దూషించెను. డాక్టరు పట్టాభిసీతారామయ్యగారిని చేసినవేళాకోళము చెప్పనలవికాదు. ఆంధ్రావనిలో సమర్థులైన అనేకపత్రికారచయితలు బయలుదేరిన యీరోజులలో కృష్ణాపత్రికతేనరచనయే మిన్నయని భ్రమించుట సరికాదు. ప్రజాభిప్రాయము ఆంధ్రప్రముఖుల యభిప్రాయము. ఎట్లున్నదో గమనించుట కృష్ణాపత్రికవిధి. కాంగ్రెసు పేరిట, గాంధి మహాత్ముపేరిట, జాతీయతపేరిట ఆంధ్రోద్యమము కృష్ణాపత్రిక నిరసించుపద్ధతిని ఆంధ్ర విజ్ఞానులు హర్షించలేరు. ఆంధ్రరాష్ట్రీయతను పెంపొందించుటలో కృష్ణాపత్రికప్రారంభమందు చూపిన విధానమునే ముందుకూడ ననుసరించిన ఆంధ్రులందరును ఆనందించగలరు.

### ఆంధ్ర విశ్వవిద్యాలయము — తెలుగు

ఆంధ్రవిశ్వవిద్యాలయములో తెలుగున విద్యాబోధ తక్షణమే ప్రతిపాదింపవలెనని రెండు మూడేండ్లనుండి కృష్ణాపత్రిక వాదించుచున్నది. వాదించడమేకాదు ఉపాధ్యక్షుడు రామలింగారెడ్డిగారిమీద నిందమోపుచు సంపాదకీయ ప్రకటనలు చేయుచున్నది. దానిపైరెడ్డిగారు పత్రికలకొక చిన్నసమాధానమిచ్చిరి, మద్రాసుప్రభుత్వము వారు తెలుగుభాషాద్వారా విద్యగరపమని ఆంధ్రవిశ్వవిద్యాలయమువారిని ప్రోత్సహించు ప్రకటనచేసినను సరే లేక మద్రాసు విశ్వవిద్యాలయముముందుగా తెలుగులోను,తమిళములోను విద్యాబోధ ప్రారంభించినను సరే తాము వెంట నేయనుసరింతుమనివ్రాసిరి. రెడ్డిగారి సమాధానము న్యాయముగానున్నను కృష్ణాపత్రిక వినిపించుకొనక లేక రెడ్డిగారివ్రాతను గ్రహింపలేకనో తిరిగిరిరి ఆదేరీతిగా వ్రాయుచువచ్చెను. హిందూదేశము లో ఏవిశ్వవిద్యాలయమునకు లేని పాలనాపద్ధతిని ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు తెప్పించినది రెడ్డిగారు. రెడ్డిగారు ఆంధ్రభాషావేత్త. అట్టివారికి తెలుగులో విద్యాబోధ అయిష్టమనుట సరికాదు. రాయలసీమజిల్లాలు ఆంధ్ర విశ్వవిద్యాలయములోచేరుట ప్రస్తుతము ప్రధానసమస్య. దానిని రెండున్నర సంవత్సరమున్న కాంగ్రెసు ప్రభుత్వం చేయలేకపోయెను.

— —

### ఫ్లాండర్సు యుద్ధకథ

జూను రవతేది నాడు బ్రిటిషు పార్లమెంటుకామన్సుసభలో ప్రధాని చర్చిల్ గారు ఫ్లాండర్సులోనుండి బ్రిటిషుసేనలు 3,35,000మంది స్వదేశమునకు చేర్చబడిరనియు, చాలమందు యుద్ధసామగ్రియు నష్టమయ్యెననియు ప్రకటించిరి. ఈసామగ్రినష్టమును త్వరలోపూడ్చుట కష్టమనియు జరిగి అసామగ్రితయారుకై ఫ్యాక్టరీలు పని చేయుచున్నదనియు చెప్పిరి. ౩౦ వేలమంది సైనికులను రక్షించజాలకపోయితిమనుచు వారిలోచాలమంది స్వదేశమునకు మరలిరాగల్గిన బాగుండునని అనిరి. ఈసేనలను ఫ్లాండర్సులోనుండి రేవునకు గొనిపోవునపుడును అక్కడినుండి ఓడలలో తీసికొనిపోవునపుడును జర్మనులు ఫిరంగులను, విమానాలనుండి బాంబులను, మందుగుండులనువేసి బాధించిరనియు, ఈసందర్భములో బ్రిటిషు విమానాలు నాల్గింతల సంఖ్యగల జర్మనువిమానాలతో పోరాడి జర్మనులకు చాలనష్టముకలిగించి తరిమివేయగలిగెననియు చెప్పిరి. ఇకముందు శత్రువు బ్రిటనుమీదికి రావచ్చుననియు: ఇపుడుదేశరక్షణకై గట్టియేర్పాట్లు చేయగలమనియుచెప్పిరి. ఇట్టిసంగతి ఆదేరోజు పార్లమెంటులార్డ్సుసభలోకూడ ప్రకటించబడెను. అవసరమైనచో ముందు ఏర్పాట్లనుగూర్చి రహస్య సమావేశములో చర్చచేయవచ్చునని చర్చిల్ గారు చెప్పిరి.

ఇదేవిధముగ ఫ్రెంచిప్రధాని రీనాడుగారు ఛాంబరు కాన్సిలులో ఫ్లాండర్సునుండి బ్రిటిషు ఫ్రెంచిసేనలను తొలగించగలిగినందున, ఫ్లాండర్సులో అసేనలను ముట్టడివేసి లొంగదీయవలెనను జర్మనుల ఆశలు భగ్నమయ్యెనని చెప్పినారు.

# శ్రీకృష్ణ గ్రంధాలయ ... తీయ వార్షికోత్సవము

(విలేఖరి) మహబూబాబాదు,

... జూను ... రినోధకమండ... విక్రమసం॥ర జ్యేష్ఠశు౹౧ శుక్రవా... (కింద్రా... నాగభూషణంగారి అధ్యక్షతక్రింద జయప్రదముగ జరిగెను

గ్రంధాలయ ... గ్రంధాలయ సభ్యులు ... మంది సమావేశమైరి యస్ బి రామానుజాచార్యుల గారు ప్రారంభోపన్యాసము గావించిరి తర్వాత అధ్యక్షులవా రుపన్యసించుచు గ్రంధాలయాభివృద్ధినిగురించి సభ్యులు తేమమనో ద్వేషములుమాని చాల ఉత్సాహముతోను పని చేయగలందులకు ప్రోత్సహించిరి బకాయచెల్లించగలందుకు మనవిచేసిరి తర్వాత డా వి గోపాలరావుగారు తమనివేదికను వినిపించిరి,

టి. పుల్లయ్యగారు గ్రంధాలయము యొక్క ప్రస్తుతపరిస్థితులు వివరించుచు ముందు అభివృద్ధికి సూచనలుచేసిరి. బి. నారాయణగారు, విదేశ గ్రంధాలయముల అభివృద్ధినిగురించియు, అక్కడివారు గ్రంధాలయములకుచేయు కృషిని గురించి చెప్పుచు మనముకూడ అదేవిధముగ పాటుబడి అభివృద్ధి తేవలయునని చెప్పిరి

కే. వీరయ్యగారు గ్రంధాలయముల యొక్క ఉపయోగములనుచెప్పి, అవి భాషాభివృద్ధికి ఎవిధముగ తోడుపడునది విశదీకరించిరి అవధాని గారు గ్రంధాలయములవలన పురాతన గ్రంధములు నశించకుండునటుల చేయవచ్చుననియు, సమయమువచ్చినపుడు పురాతన విషయములు కావలసిన, గ్రంధాలయములనుంచి తెలుసుకొనవచ్చుననియు ధనికులు గ్రంధాలయములను పోషించిన యెడల చాల బీదలలో భాషాప్రచారము చేసినవారగుదురనియు విశదీకరించిరి

## క్రొత్త కార్యవర్గము

అటుతర్వాత రాబోవు సం॥ర కార్యవర్గము క్రిందివిధముగా ఎన్నుకొనబడెను

అధ్యక్షులు— మ. రా శ్రీ యస్ బి రామానుజాచార్లగారు,

ఉపాధ్యక్షులు— వనం కృష్ణమూర్తిగారు,

కార్యదర్శి— టి. పుల్లయ్యగారు,

సహాకార్యదర్శి— వందనం వీరభద్రంగారు

కోశాధిపతి— కొమరగిరి వేంకటేశ్వరరావుగారు

కార్యనిర్వాహక సభ్యులు—

చిమ్మర్తి నాగభూషణం, అప్పె వేంకటరాజయ్య. డా. వి గోపాలరావు, అవధానిగార్లు

తదనంతరం ఈక్రింది తీర్మానములు డాక్టరు వి. గోపాలరావుగారు ప్రవేశపెట్టగా ఏకగ్రీవముగా ఆమోదించనైనవి —

౧. గంద్రా నారాయణరావుగారు గ్రంధాలయమునకు ఉచితముగా గృహమిచ్చినందుకు గడచిన సం॥రము వారిఆదరణక్రింద జయప్రదముగ జరిగినందుకు ఈసభవారు కృతజ్ఞత తెలుపుచు, శాశ్వతముగా గృహము ఇవ్వగలరని ఆశించుచున్నారు

౨. గ్రంధాలయములో నెలకొకసారి సాధారణసమావేశము ఏర్పాటుచేసి అందు భాషా విషయమైన ఉపన్యాసములు ఇవ్వగలందుకు ఏర్పాటు చేయవలెనని కోరుచున్నారు

౩. గత రెండు సంవత్సరములనుంచి అధ్యక్ష పదవి, అంగీకరించి చాలాఓర్పుతో గ్రంధాలయ కార్యములను నిర్వహించి, గ్రంధాలయమును అభివృద్ధిచేసిన కొమరగిరి వెంకటేశ్వరరావు గారికిని గ్రంధాలయ పునరుద్ధారణ జరిగినప్పటినుండియు గ్రంధాలయకార్యములను తమస్వంతపనులకన్న అధికముగాభావించి నిరంతరకృషిచేసి ఈ స్థితికి తేగలిగినకార్యదర్శియగు డాక్టరు వి గోపాలరావుగారికిని గ్రంధాలయాభివృద్ధికి తోడుపడిన ఇతరమహనీయులకును ఈ సభవారు కృతజ్ఞత తెల్పుచున్నారు

౪. గ్రంధాలయమునకు లోకల్ ఫండు నుంచి ఏదైన కొంతడబ్బుసహాయముచేయునట్లుగా పైరవిచేయగలందుకు సమర్థతగలవారిని ఒకరిని నియమించవలెనని కోరుచున్నారు

అప్పె వేంకటరాజయ్యగారు వచ్చిన సభ్యులకు కృతజ్ఞత తెల్పిరి తర్వాత అధ్యక్షునికి కృతజ్ఞతాభివందనములతో సభ ముగించనైనది. వచ్చిన సభ్యులందరికిని అల్పాహార విందు ఒసగబడెను సాయంత్రము ౭ గంటలకు సభ సమాప్తి జెందెను

# యుద్ధ సంబంధమైన వార్తలు

హైదరాబాదు (దక్కన్) అమర్దాదు ౮ నైజాం యిలాకాలో యుద్ధసంబంధమైన వార్తావిషయములగు ప్రకటనలపై ప్రభుత్వము వారి సంపూర్ణ నిగరానీ యుండును

# సరఫ్ఖాన్ సదరుల్ ...హా మ్గారి వేతనము

హైదరాబాదు (దక్కన్), జూన్ ౮ సరఫ్ఖాన్ సదరుల్ మహాము గా ...ండిన ... ఆలీ జానవాజుజంగ్ బహద్దర్ గారికరు ౩౫౦ ల వేతనమునకుబదులు ౧౦౦౦౦ల ... గలవు ౧ వానిశాఖలో వీరికి ... ల ... యినది

## ఆర్యసమాజీయుల బీదరు ప్రయాణము

హైదరాబాదు (దక్కన్), అమర్దాదు ౮ నేడుపగలు ౧౦౹ గం లకు డీజల్ కారు ద్వారా నరేంద్రజీ సక్సేనా గారు పం రాజగురు ధురేంద్రశాస్త్రిగారును బీదర్ ఆర్యసమాజ మంత్రిగానుండిన బన్సిలాలుగారును బీదరుకుపోయిరి

# పోస్ట్ కార్డ్ పేనాలనిషేధం

యుద్ధకాల మున ...గ్గించుటకుగాను, బ్రిటన్లో పోస్ట్-కార్డ్-పేనాలు వాడకూడదని సింధు వివ్యాధికారులు నిషేధించిరి ఇంతేసముండే కాగితము ధర చాలా ఎక్కువైనందున, కొటుపుస్తకములకుబదులు పలకలు వాడవలసినదిగా ... నిర్ణయించియుండిరి

సంవత్సరము చందా
౬ షాలీ రూపాయిలు
ఆరుమాసాలకు
3 రూపాయిలు
బ్రిటిషిండియాలో
సం॥చందా
౫-౮-౦ కల్దారు.
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

The only
Popular Paper
That reaches
The masses
In the Dominions

Best Medium
for
Advertisement

**Volume 15** | **Hyderabad-Dn.** | **Thursday 13 June 1940** | **Number 12**

## సెషన్సులో బీదరు హత్యా ప్రయత్నాభియోగము

### వాదిసాక్షుల విచారణ

బీదరు, జూను ౫

బీదరు మున్సిఫులగు సయ్యదలీఖాన్ గారు సెషన్సుకుపంపిన బ్రిజుపాలు, మానిక్ రావు, విఠల్దాస్ అనునిందితులవిచారణ ఇక్కడ గుల్బర్గా సెషన్సు న్యాయాధికారియగు మిర్జాహసన్ అహమ్మదు బేగుగారి సముఖములో ప్రారంభమయ్యెను. మొదటియిరువురు నిందితులును హత్యాప్రయత్నమను నేరముచేసిరనుఆరోపణతో సెషన్సుకుపంపబడిరి. కడపటివాడు ఆనేరమునకు ప్రోత్సహించుటయేగాక నిందితునికి తనయింటిలో చోటిచ్చెననుఆరోపణతో పంపబడెను.

ఫిర్యాదులో చెప్పబడినదేమనగా, గత మార్చి ౨౭వ తేదివాడు మధ్యాహ్నము ౧-౨ గం. లవేళ సాలార్ షరీఫునున్ను బ్రిజుపాలుమున్ను టోలిగున్నసాకోవద్ద కొంతమాటలసంఘర్షణజరిగెను. అప్పుడది పెద్దకొట్లాటకాలేదు. కానిసాయంత్రము ౫ గం. లవేళ బ్రిజుపాలున్ను, మానికరావున్ను విఠల్దాసు ప్రేరణపై అతనియింటినుండిబయలుదేరిపోయిసాలారుషరీఫును మొదట లాఠీతోకొట్టినట్లుచెప్పినారు. ఈనేరమునుచూచినవారలు వారలను విడదీయుయత్నించుచుండగా బ్రిజుపాలు మాణికరావునుండి తుపాకి తీసికొని సాలారుషరీఫుపై కాల్చినట్లును, అందుచే సాలారుషరీఫుకుగాయమైనట్లును తెలవబడుచున్నది. మాణిక్యరావుఅక్కడనే అరెస్టుచేయబడెను కానిబ్రిజుపాలు అక్కడినుండిపారిపోయి విఠలుదాసు యింటిలో దాగెను అక్కడినుండిన విరల్దాసుతనయింటికిపోయితాళముచేసిబ్రిజుపాలునులోపలచేయుంచి శాసనప్రకారము అతనిని అరెస్టునుండితప్పించెను. ఇదిప్రాసెక్యూషన్ తరఫున చెప్పబడినట్టికథ.

### బండివాని సాక్ష్యము

బండివాడగు సాలార్ షరీఫు సాక్ష్యముచెప్పుచు మార్చి ౨౭వతేది బండితోలుచు చిద్రికమాను గుండాపోవుచుండగా బ్రిజుపాలు రోడ్డుమధ్యకు వచ్చినిలచెననియు, ఆరోజు హోలిపండుగ యనియుచెప్పెను. తాను బ్రిజుపాలును ప్రక్కకుజరుగుటకైకోరెను. అప్పుడు బ్రిజుపాలు ఆరోడ్డు "నీతండ్రిదికాదు!" అని బండివానితో ననెను. అందుపై సాలార్ షరీఫు ఆరోడ్డుతనతండ్రిదిగాని. బ్రిజుపాలుతండ్రిదికాని కాదనియు, ప్రభుత్వము వారిరాజబాటయనియు చెప్పెను బ్రిజుపాలు జరుగలేదు. అందుపై సాలార్ షరీఫుబండిదిగి బ్రిజుపాలును అవతలికిజరిపెను. అందుపై బ్రిజుపాలు సాలార్ షరీఫు బండితోలుచుండగా అతనిపై రోడ్డునుండి ఏతినరాళ్ళు విరువ్వెను. సాలార్ షరీఫుకు మణికట్టుపైఒకటియు. వీపుపైఒకటియు రాయితగిలినందున, నాతడుబండిదిగి బ్రిజుపాలును సవాలుచేసెను. అందుచేమాటలు సంఘర్షణ జరిగెను. దోవనడచుచుండి నవాబలుము, అబ్దుల్ సలాం అనువారునువచ్చి వివాదమునాపించిరి. సాలార్ షరీఫుపోవుచుండగా, బ్రిజుపాలు ఆదిహోలిపండుగరోజనియు, ముసల్మాను రక్తపాతముచేసి, హోలిపండుగ గావింతుననియు చెప్పినట్లు వినపడెను.

సాయంకాలము సాలార్ షరీఫు స్టేషనునుండి ౬ సామాన్ గం. కుపోయెను: తన.బండిని సంగప్ప దుకాణమువద్దఆపి సంగప్ప వేదికపై కూర్చుండెను. అక్కడ ఇతరబండ్లవారలుకూడచేరి కూర్చుం

(౮ వ పేజీ చూడుడు)

### హైదరాబాదు బజారుధరలు

౬ అమర్దాదు ౧౩౪౯ ఫ.

ఈరోజు ఒకటిరెండు వస్తువుల ధరలు తప్ప తక్కినవన్నియు గతసంచికలో ప్రకటించబడిన అమర్దాదు ౪వ తేదినాటివేయున్నవి. మారిన ధరలు మాత్రం క్రింద తెల్పబడినవి.

పజ్జలు పల్లాకి రూ ౧౧
కందిపప్పు ,, రూ౧౬౻
బంగారం తులం ౧కి రూ౫౪
వెండి ౧౦౦ తులకి ౭౪.



### ఖోవా తినుటవలన (౨౫) మందికి విషమెక్కుట

హైద్రాబాదు, అమర్దాదు ౬

ఆలాదుఖోవాతినుటవలన (౨౫)మందికి విషమెక్కెను. వాంతిభేదులు ప్రారంభమయ్యెను. వీరిలో(౧౯)గురు నాంపల్లిలో ఖోవాను కొనిరి. (౬)హాతివాలాద్రిదగ్గర కొనిరి. అందరు దవాఖానాలో ప్రవేశపెట్టబడిరి. ఈవిషయము పోలీసుకు తెలిసినవెంటనే వివరములను తెలిసికొనుటకు వెళకుచున్నారు. ఇట్లు ఖోవాను తిన్నవారలలో హిందూ ముస్లింలు ఉన్నారు.

(దక్కన్ న్యూస్)



Printed and Published by, G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad Dn Editor- S Prathapa Reddy B. A. B. L